క. భీకరశోకాగ్నిశిఖా
నీకము శిథిలములొనర్చి నెఱకులనెల్లన్
పైకొలుపు దేహశోషముఁ?
బ్రాకటముగ నంతరాత్మ వడిగ దహించున్.

(ఆలోచించి) "బిడ్డా! శ్రద్ధా! నేనిక్కడనుండి హింసాప్రధానమయిన యుద్ధమును జూడలేను కాఁబట్టి నేనకాశీకాపురమును విడిచి సాలగ్రామమును పేరుగల విష్ణుక్షేత్రమునందుఁ గొంతకాలము గడపెదను. నీవక్కడకువచ్చి వృత్తాంతమును జరిగిన క్రమమున నాకు నివేదింపుము" అని విష్ణుభక్తిదేవి నాకాజ్ఞాపించినది కాఁబట్టి యాదేవిసన్నిధానమునకుఁ బోయి యీసమగ్రవృత్తాంతము సర్వమును నేనామెకు విన్నవించెదను (ముందుకు నడిచి చూచి) ఇది యాచక్రతీర్థము. ఇందుసంసారసాగరోత్తారకమయిన నావకుఁ గర్ణధారుఁడైన భగవంతుఁడగు శ్రీహరి ప్రత్యక్షముగా వాసము చేయుచున్నాఁడు (ప్రణమిల్లి) ఇదిగో మునులచే నుపాస్యమానురాలయిన విష్ణుభక్తిదేవి శాంతితో నేదో యాలోచించుచున్నది. నేనామెకు సమీపమునకుఁ బోయెదను (అని ముందుకు నడుచుచున్నది.)

[అంతట విష్ణుభక్తియు శాంతియుఁ బ్రవేశించుచున్నారు]

శాంతి—అమ్మా! మీరు ప్రబలచింతాకులహృదయ లయి యున్నట్లు కానఁబడుచున్నారు.

విష్ణు—బిడ్డా! మహావీరతుల్యాకారమయినయీ ఘోరయుద్ధమునందు బలవంతుఁడైనమహామోహునితోఁ బ్రతిఘటించిన పుత్త్రప్రాయుఁడైన వివేకునివృత్తాంత మేమయినదో తెలియకపోయెనని నామనస్సు వ్యగ్రమగుచున్నది.

శాంతి—దేవీ! ఇక్కడ విచారింపవలసినపని యేమున్నది? దేవిగారియనుగ్రహమున్నందున వివేకమహారాజునకు విజయము నిశ్చయమని నేనెఱుఁగుదును.

విష్ణు—బిడ్డా.

క. ఘనధర్మపక్షబలమున
ననివార్యంబుగ లభించు నభ్యుదయంబుల్?
విను మట్లయ్యెను, సుహృదుల
మనసెపుడు నపాయశంక మఱిమఱిఁబూనున్.

అంతేకాక శ్రద్ధ యింతతడవు రాకుండుట మనస్సునకు సందేహము పుట్టించుచున్నది.

శ్రద్ధ—(సమీపమునకుఁబోయి) భగవతీ! ప్రణమిల్లుచున్నాను.

విష్ణు—శ్రద్ధా! నీవు క్షేమముతో వచ్చితివా?

శ్రద్ధ—దేవిగారి యనుగ్రహమువలన.

శాంతి— అమ్మా! ప్రణామము చేయుచున్నాను.

శ్రద్ధ— పుత్త్రీ! నన్నాలింగనము చేసికొనుము.

శాంతి—(తల్లిని కౌఁగిలించుకొనుచున్నది)

శ్రద్ధ—బిడ్డా! విష్ణుభక్తి దేవిప్రసాదము చేతి మునిజనమనోనివాసమును బొందుము.

విష్ణు—అక్కడ నేమిజరిగినది ;

శ్రద్ధ—దేవిగారికిఁ బ్రతికూలముగాఁ బ్రవర్తించువారికిఁ దగినట్లు జరిగినది.

విష్ణు—అది సవిస్తరముగాఁ జెప్పుము.

శ్రద్ధ—దేవీ! అవధరింపుము దేవి యట్లాదికేశవాలయమునుండి వెడలఁగానే తనపాటలవర్ణమును గొంచెము విడిచి సూర్యుఁడు ప్రకాశించుచుండగా విజయ ఘోషాహూయమానానేక వరవీరగళహుంకృతసింహనాదబధిరితదిగంతంబును సతతధావత్తురగ ఖరతరఖురఖండితభూమండలోచ్చలద్ధూళిపురరజఃపటలాంతరితభాస్కరబింబంబును బ్రబలతరకర్ణతాళాస్ఫాలనోత్పన్నమదకరిఘటాసిందూరసంధ్యాయమానదశదిశంబును బ్రళయజలధరధ్వానభీషణంబును నగు వారియొక్కయు మనయొక్కయుం సైన్యసాగరము సన్నద్ధమయి యున్నప్పుడు వివేకమహారాజు మహామోహమహారాజునకడకు న్యాయాయిత దర్శనుని దూతనుగాఁ బంపెను. అతఁడు బోయి మహామోహునితో నిట్లనియె—

మ. చను, విశ్వాలయపుణ్యకాననదీసాన్నిధ్యభక్తాంతరం
గనివాసంబు త్యజించి, మ్లేచ్ఛమహిఁ గొంకక భృత్యవర్గంబుతోఁ
జనకున్నన్, గరవాలదారితభవత్సర్వాంగధారోత్కట
ఘనరక్తంబులు త్రాగఁగాఁ గలిగెడునక్కల్ మ్రింగు మాంసముల్.

విష్ణు—తరువాత తరువాత.

శ్రద్ధ—దేవీ! తరువాతఁ గోపముచేత వికటలలాటతటతాండవితభ్రుకుటియై మహామోహుఁడు—"ఈదుర్నయపరిపాకఫలము వివేకపుత్రత మనుభవించుగాక!" అని పలికి, తానే మొట్టమొదటఁ బాషండాగమబృందములను బాషండశాస్త్రసహితముగా యుద్ధమునకుఁ బురికొల్పెను. ఆలోపల మనసైన్యమునందు,

గీ. వేదవేదాంగతతు లుపవేదసమితి
స్మృతిపురాణేతిహాసాదు లెలమిఁ గొలువఁ,
జంద్రసమకాంతితో సరస్వతి, సరోజ
కర యగుచు నిల్చె నాకస్మికముగవచ్చి.

విష్ణు—తదనంతరము.

శ్రద్ధ—దేవీ ! అప్పుడు వైష్ణవ శైవ సౌరాదులయిన సర్వాగమబృందములును సరస్వతీదేవి సకాశమునకు వచ్చెను.

విష్ణు—అటుతరువాత.

శ్రద్ధ—తదనంతరమున—

శా. వేదోమీమాంస, సరస్వతీసతిపురోవీథిన్ రణోత్సాహయై,
ప్రాముఖ్యస్థితి న్యాయకాపిలమహాభాష్యాదిసద్గ్రన్థ
స్తోమంబు లొరగాలుచుండగ ధర్మగుప్తిన్, శుద్ధాయుతన్యాయకో
ర్భిమాకారిణి నిల్చె, దుర్గ్రహణిన్, వేదత్రయీ నేత్రియై.

శాంతి—స్వభావప్రతిపక్షము లయినయోగము న్యాయశాస్త్రప్రపదము లొకట్రొటిగాఁ గలియుట యెట్లు సంభవించినది ?

శ్రద్ధ—పుత్రీ !

క. ఇతరేతర వైరమునన్
సతము మెలఁగు నేకవంశజాతులు తమకున్
క్షితిలోపల నవమానం
బితరులచేఁ గల్గుచోట నేకముకారే ?

ఏకపరిమాతము లయినతమకు లోలోపల విరోధమున్నను, వేదసంరక్షణముకొఱకును నాస్తికపక్షాధిక్షేపణముకొఱకును శాస్త్రసంఘముల కైకమత్యము కలుగును. ఆగమసముదాయములో సహితము విరోధము తత్త్వవిచారములందుఁ గానరాదు. ఎట్లన—

శా. శాంతం బద్వయ మవ్యయం బజము శర్వాద్బ్రహ్మ, మాతన్వను
శ్రాంతం బాగమపంక్తిచే సగుణతన్ బ్రహ్మచ్యుతేశాఖ్యలన్
ఇంతొప్పన్ బహుధా స్తుతింపఁగఁబడున్ ? నానాగమశ్రేణి సం
క్రాంతింబో నొకబ్రహ్మమంచు నె, సమర్పింపందు నెల్లున్ బలెన్.

విష్ణు—తరువాత ? తరువాత ?

శ్రద్ధ—దేవీ ! తరువాత నిరువాఁగునందును నిరంతరశరనికరధారాసారపాతోపద్రుతమద్దినలగుకరితురగరథపదాతులకును నుభయపక్షయోధజనులకును సంకులసమరంబు సంప్రాప్తమయ్యెను. అప్పుడు,

మ. ప్రవహించె న్నదులస్రతోయములుఁ, గ్రవ్యస్ఫారపంకంబులున్,
వివిధోద్యద్ఘనకంకరంకసివహోభీలావకీర్ణాంబులున్,
నవనారాచవిభిన్నహస్తిగిరిశీర్ణభ్రష్టవేగోల్లస
ద్ధవళచ్ఛత్రసమూహహంసములు నైతద్వ్యాప్తరంగంబుసన్.

ఆమహాదారుణసంగ్రామంబునఁదఁ బరాపరపక్షవిరోధిత్వముచేతఁ బాషండాగమ బృందమును ముందుంచుకొని వచ్చినలోకాయతికతంత్రసముదాయము మాన్యాన్వయసైన్య విమర్దనముచేత విధ్వస్తమయ్యెను; అనంతరము పాషండాగమజాలము నిర్మూలమగుట చేతసదాగమసాగరప్రవాహముచేతఁ గొట్టుకొనిపోయెను. తదనంతరము సౌగతాగమ సముదాయములు సింధుగాంధారమగధాంగపారశీకవంగకళింగాది మ్లేచ్ఛప్రాయదేశము లఁబ్రవేశించెను. పాషండదిగంబరకాపాలికాద్యాగమసంచయంబులు పామరబహుళంబు లైన పాంచాలమాళవాభీరావర్తసాగరానూపదేశములయందు నిగూఢముగా సంచరించు చున్నవి; న్యాయమూర్ధ్వనుగతయైన మీమాంసచేత గాఢప్రహారజర్జరీకృతములైన నా స్తికతర్కసమూహంబులు తమయాగమసందోహంబులు పోయినదారినే పోయినవి.

విష్ణు—అటుతరువాత,

శ్రద్ధ—అటుతరువాత వస్తువిచారునిచేతఁ గాముఁడుహతుఁడైనాఁడు; క్షమ చేతఁ గ్రోధపారుష్యహింసాదులు హింసింపఁబడినారు; సంతోషునిచేత లోభతృష్ణా దైన్యానృతవాద పైశున్యస్తేయపరిగ్రహులు నిగ్రహింపఁబడినారు; అనసూయచేత మత్సరుఁడు జయింపఁబడినాఁడు; పరోత్కర్షసంభావనునిచేత మదుఁడుసంహరింపఁ బడినాఁడు; పరగుణాధిక్యునిచేత మానుఁడు ఖండింపఁబడినాఁడు.

విష్ణు—(హర్షముతో) చక్కఁగాజరిగినది. ఇఁకమహామోహునికథయేమయినది?

శ్రద్ధ—దేవీ! మహామోహుఁడు యోగవిఘ్నసహితుఁడయి యెక్కడనో యడఁగియుండుటచేత నాతనిజాడ తెలియరాకున్నది.

విష్ణు—అట్లయినచో మహానర్థశేషమింకనునిలిచియేయున్నది. అతఁడుపరిహరణీయుఁడు. ఎట్లన—

క. పరమాదరపరుఁ డగుచున్,
శ్రీరసంపదఁ గోరుశేముషీమంతుం డిం
దరిశేష మగ్నిశేషము
గురుతరఋణశేష ముంచఁగూడదుసుమ్మీ.

ఇఁక మనస్సుయొక్క వృత్తాంతమేమి?

శ్రద్ధ—దేవీ! పుత్రపౌత్రాది మరణజాతశోకావేశముచేత నాతఁడును బ్రాణ త్యాగము చేయనిశ్చయించుకొన్నాఁడు.

విష్ణు—(చిఱునవ్వునవ్వి) ఇదియంతయు నిట్లయ్యెనేని మనము కృతార్థతను బొందినారము; పురుషుఁడును బరమానందమును బొందును. అయిననుదురాత్ముఁడయిన యతఁడు ప్రాణత్యాగ మేలచేసికొనును?

శ్రద్ధ—ఉపనిషద్దేవి ప్రబోధోదయమునకొఱకు గృహీతసంకల్పురాలయి యున్నందున నతఁడీవిధముగా శరీరముతోఁ జిరకాలముండఁడు.

విష్ణు—అగుఁగాక! వైరాగ్యోత్పత్తికొఱకు వైయాశికియైన సరస్వతిని నేనాతని కడకుఁ బంపెదను.

(అంతయును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశకము.

---

(అప్పుడు మనస్సును, సంకల్పుఁడును, ప్రవేశించుచున్నారు.)

మన—(కన్నీటితో) హా! పుత్రికలారా! ఎక్కడకుఁబోయినారు! ఒక్కసారి మీప్రియదర్శనమిండు. ఓకోరి కుమారులారా! రాగద్వేష మద మాన మాత్సర్యులారా! నన్నుఁ గౌఁగిలించుకొండు. నా యంగములు నొచ్చుచున్నవి. అయ్యో! అసాధుఁడను వృద్ధుఁడను నయియున్న నన్నొక్కఁడయిన నాదరింపఁడేమి? ఓయసూయాద్యాశలైన కన్యకలారా, మీరెందుఁబోయినారు, ఆశాహింసాతృష్ణాదులైన కోడండ్రారా! మంద భాగ్యుఁడనైన నాకొక్కరును దక్కకుండ దైవహతకుఁడు మిమ్మందఱ నేక కాలమునం దెట్లెత్తుకొనిపోయినాఁడు! (తడఁబాటుతో)

మ. తనువెల్లన్ విషవహ్నియట్లు లమెడున్; దాఁ గాల్చెను మర్మముల్;
పెనుపొందించెనుఁ దీవ్రవేదనల; నైపెంపెల్ల మర్దించెనన్;
ఘనమోహాంధ మొదఁగూర్చెడున్; వరవివేకంబెల్లఁ బోఁ గార్చెడున్;
మనమున్ జీవితమున్ గ్రసించెడు, వెసన్ శోకజ్వరంబక్కటా!

(అని మూర్ఛిల్లుచున్నాఁడు)

సంక—ఓరాజా! తెప్పిఱిలుము.

మన—(తెప్పిఱిల్లి) ఇట్టియవస్థను బొందియున్న నన్ను జీవనైకప్రవృత్తిసహిత మాశార్వకున్న దేమి?

సం—(కన్నీరు విడుచుచు) దేవా! ఇంకను నీకుఁ బ్రవృత్తిదేవి యెక్కడిది? కుటుంబమరణసంజాతశోకానలతప్తహృదయ యయి యామె గుండెలుపగిలి మృతి నొందినదని విన్నాఁడను.

మన—హా! ప్రియురాలా! నాకొక్కప్రియమయిన ప్రతివచనమేలయియ్యవు? కటకటా!

ఉ. దేవిరో! నన్నుఁ బాసి యును త్రిమ్మరవెన్నఁడు స్వప్నమందునన్
నీ వెడఁబాసియుండుటను నేమ్మతకల్పుఁడనైతి నిత్తఱిన్;

దైవవిచేష్టితంబునను దవ్వులఁ బోయెడిదాన నీవు, నేఁ డహో !
జీవము శోధనుండెద ; నిసీ ! యసువుల్ కరమున్ దురంతముల్.

(అని మరల మూర్ఛపోవుచున్నాఁడు.)

సంక — ఓరాజా ! ఊఱడిల్లుము, ఊఱడిల్లుము.

మాన — (తెలివి తెచ్చుకొని) ఇఁక నాకు జీవితాశ చాలును ఓసంకల్పా ! చితి పేర్చుము ఇప్పుడు నే నగ్నిప్రవేశముచేత శోకానలము నార్పుకొనియెదను.

(అని సన్నాహపడుచున్నాఁడు)

[అప్పుడు వ్యాససరస్వతి ప్రవేశించుచున్నది]

సర — "సఖీ ! సరస్వతీ ! అపత్యమరణఖిన్నుఁడయియున్న మనస్సు నొక్క ప్రబోధము గావింపుము. అతనికి వైరాగ్యోత్పత్తి యెట్లు కలుగునో యట్లు చేయుము" అని భగవతియైన విష్ణుశక్తి నన్నుఁ బంపినది గావున. నే నిప్పు డాతని సన్నిధికే పోయెదను. (సమీపమునకుఁబోయి) వత్సా ! ఈవిధముగా నీవతిసంతాపము నేల పొందెదవు ; పదార్థము లనిత్యములని నీకీపాటికిఁ దెలిసినదేకదా ! ఇతిహాసములును, ఉపాఖ్యానములును, నీవీవఱకుఁ జదివినవే.

చ. అరయ విరించి యాదిగ సురాసురులున్ మునిముఖ్యులున్ మనుల్
ధరణియు వార్ధు లద్రిగణముల్ కల్పశతాయువు ద్రెగన్,
బొరసెద ఘోరశోకకరమోహము ! స్త్రీయులబుద్బుదోపమా
స్థిరతనుసంహతుల్ తెగి నశించినయప్పుడు చూడు లేమనన్ ?

కాఁబట్టి పుట్టిన పదార్థములయనిత్యత్వమును భావించుకొనుము. నిత్యానిత్యవస్తువివేకి యగువానిని శోకమంటదు.

గీ. బ్రహ్మమొక్కటియే సత్యవస్తువగుచు
నితరమెల్ల వికల్పిత మెప్పుడగును,
యప్పు డేకత్వమును జూచు ? నట్టివాని
కెక్కడిది మోహశోకంబు లెంచిచూడ ;

మాన — భగవతీ ! శోకావేగదూషితమయి యున్న నా మనస్సునం దిప్పుడు వివేకమునకే యవకాశము లేదు.

సర — వత్సా ! ఇది స్నేహదోషము స్నేహము సర్వానర్థమూలకమన్న యీయర్థము సుప్రసిద్ధమేకదా !

మ. ప్రియనామంబునఁ గ్లేశదుర్విషలతాబీజంబుల న్నాటఁగాఁ!
బయికిన్ స్నేహమయాంకురంబు లడరున్ వహ్నాగ్నిగర్భంబులై ;

ఘనులం బ్రాఁకుచు శోకవృక్షములిటుల్ బహ్వార్తి శాఖాశిఖల్
బయిపారన్ శతముల్ తుషాగ్నిగతి మెల్లంగాల్చు దేహంబులన్.

మన — దేవీ! ఇదియంతయు సత్యమే. అయినను శోకానలదగ్ధుఁడ నయిన నేను ప్రాణములు నిలుపుకొనుటకు శక్తుఁడను గాకున్నాను. అంత్యకాలమునందు మీ దర్శనమగుట మేలయినది.

సర — ఓయీ! ఈ కాలిత్రహత్యాప్రయత్నము మిక్కిలి యాశ్చర్యము. అంతే కాక యీయపకారులనిమిత్తము నీకీవేగిరపాటేల? ఆలోచించి చూడుము —

చ. ధరపయి వెన్క ముందిపుడు దారసుతాదిపరిగ్రహంబు చేఁ
బురుషసుఖార్థమై కలుగఁబోవదు మేలది నీకు నేరికిన్?
మరణమునొంది వారిపుడు మర్త్యనిషేధమొనర్తురార్తిచే;
నను లటులయ్యెఁ గాంతువు ఘనశ్రమ వ్యర్థముగాఁ దదర్థమై.

చ. కటకట! వారికై తనువు గాంచనికష్టము లేని యాభువిన్;
పటుగతి నెన్ని కొండ లెగఁబ్రాఁకెదు; వాఁకలదాఁట లెన్నికన్?
దటుకున నెన్ని ఘోరవిపినంబులు ద్రొక్కుదు; చిత్తవృత్తులన్
గుటిలవిదగ్ధవస్త్రిలను క్షుద్రనరేశులఁజూడ రెంపటిన్?

మన — దేవీ! ఇది నిశ్చయమే అయినను,

క. తనవలనఁ బుట్టి లాలన
మునయంబును గనుచు మనసునందే యెప్పుడున్
మనియెడువారలఁ బాయుట
తనప్రాణముపోకయట్లు తలకొల్పు వ్యథన్.

సర — వత్సా! ఈవ్యామోహము మమకారవాసనామూలమయినది.

గీ. ఇంటికోడిని మార్జాల మీడ్చి తెచ్చి
మ్రింగునప్పుడు కలిగెడు మేటిశోక
మెలుకనో పిచ్చుకనో భుజియించునప్పు
డొదవమి తలంప మమత లేకునికిఁ గాదె?

కాఁబట్టి సర్వవిధములచేతను సర్వానర్థబీజమయినమమత్వమును రూపుమాపుప్రయత్నము చేయవలయును. చూడు —

చ. జననమునొందు దేహమున జంతువు లెన్నియొ మర్త్యకోటికిన్!
తనువుననుండి యత్నమునఁ దాను వెలార్చునునందుఁ బెక్కుటిన్?
విను మిఁక నంమ బిడ్డలని పేరిడి కొన్నిటికిన్ దదర్థమై
దినమును గష్టపెట్టు నిజదేహము? లోకము మోహమేమనన్?

వైరా—(సమీపమునకుఁబోయి) అయ్యా! నేను నమస్కారము చేయుచున్నాను.

మన—వత్సా! పుట్టగానే నీవు నన్ను విడచిపోతివి. నన్నుఁ గౌఁగిలించుకొమ్ము.

వైరా—(ఆలింగనము చేయుచున్నాఁడు.)

మన—పుత్రా! నిన్నుఁ జూచుటవలననే నాశోకావేశము ప్రశాంతమయినది.

వైరా—తండ్రీ! ఇక్కడ శోకావేశమునకవకాశమెక్కడనున్నది?

ఉ. దారినిబాంధవుల్, లేటివరదక్షదముకాంతలు, లోకసనంబులున్
వారిదముల్. సముద్రమున వావికులున్! వడిఁగూడిపోయిన
ట్లౌరయఁ దల్లిదండ్రులును నాత్మజాలున్ సఖులున్ సహోదరుల్
చేరుదుఁ బాయుదురు టిది సిద్ధము ప్రాజ్ఞుల కేడ శోకముల్?

మన—(ఆనందముతో) దేవీ! నాకుమారుఁడు చెప్పినదియథార్థమే.

చ. అలసనయౌవనల్ లలన, లాయువినావలసత్క్రుజ్ఞ్యనజం,
బలనవమల్లికాసురభిళానిలకందళముల్, తలంప ని
ర్మలసువివేకమార్జితమంబగు మన్మతి కిప్పుడెందమూ
వుల జలమట్లు మిథ్యలయి పొల్పతి తోఁచెనుఁ దొంటివన్నియున్.

సర—నాథా! ఇదియంతయు సత్యమేయయినను గృహస్థాశ్రమధర్మమును విడిచియుపహారోత్తరకాలమయిన నుండఁగూడదు. కాఁబట్టి నేఁడు మొదలుకొని నివృత్తిదేవియే నీకు సహధర్మచారిణి కాఁగలదు.

మన—(లజ్జతో) దేవియాజ్ఞకు బద్ధుఁడను.

సర—శమదమసంతోషాదు లయిన పుత్రులు నీకుపచారములు చేయుదురు; యమనియమాదులు మంత్రులగుదురు; వివేకుఁడును నీయనుగ్రహమువలన నే యుపనిషద్దేవితోడఁగూడ యౌరాజ్యసుఖ మనుభవించును గాక! మైత్రి మొదలయిననీతోఁబుట్టువులు నలువురును. నీయనుగ్రహమునకొఱకు భగవతియైన విష్ణుభక్తి దేవిచేతఁ బంపఁబడినారు. వారిని బ్రసాదపూర్వకముగా నంగీకరింపుము.

మన—దేవి యాజ్ఞాపించినట్లు చేసెదను. మీయాజ్ఞలన్నిటిని శిరసావహించినాఁడను. (అని హర్షముతోఁ బాదప్రణామము చేయుచున్నాఁడు,)

సర—ఈయమనియమాసనప్రాణాయామాదులును. జిరంజీవివైన నీచే నాదరపూర్వకముగాఁ జూడఁదగినవారు. వీరితోఁగూడి నీవు సామ్రాజ్య మధిష్ఠింపుము. నీవు స్వాస్థ్యమును బొందినప్పుడు జీవాత్ముఁడును దనప్రకృతిని బొందును.

మ. రవిబింబంబు పయోధివీచులబలెన్, బ్రహ్మంబొకం డయ్యు సం
భవనాశాదులు పొందుతోఁచు బహుతన్ ద్వాస్సంగతిన్ వృత్తులన్;

దివుటన్ వృత్తు లడంచి నీవిఁక నివృత్తిం గూడితే, నాత్మయున్,
రవిబింబం బుదదర్పణంబునవలెన్, వాస్తైకతాచ్ఛం బగున్.

కానిమ్ము. జ్ఞాతుల కుదకప్రదానము చేయుటకొఱకు మనము నదికిఁ బోవుదము.

మన—దేవి సెలవిచ్చినట్లు చేయుదము.

[అందఱును నిష్క్రమించుచున్నారు.]



## షష్ఠాంకము.



[అప్పుడు శాంతి ప్రవేశించుచున్నది.]

శాంతి—(వృత్తి) ! నీకంతయుఁ దెలిసినదేకదా ?

వృ. కామములు పరంపరం గనఁగ గూఢముగాఁ జని మోహుఁడేడనో
యడఁగుటచే విరక్తుఁడయి యల్లమనస్సు ప్రశాంతి నొందఁగా,
వడిగను గ్లేశపంచకము వాయుటచేఁ బురుషుండు సొక్కటన్
గడుకొని తత్త్వబోధమునఁ గాంతుఁ రయొనర్చెడు నెల్లయప్పుడున్.

కాఁబట్టి నీవతిత్వరితముగా నుపనిషద్దేవి ననునయించి నాసమ్ముఖమునకుఁ దీసికొనిరమ్ము. అని వివేకమహారాజుగారు నాతో సెలవిచ్చినారు. (చూచి) ఇదిగో తనలోఁదా నేదో సంతోషముతో నాలోచించుకొనుచు నాతల్లి యీవంకనే వచ్చుచున్నది.

[అంతట శ్రద్ధ ప్రవేశించుచున్నది ]

శ్రద్ధ—ఓహో ! రాజకుల మారోగ్యమును బొందఁగాఁజూచి యిప్పుడుగదా చిరకాలమునకు నాకన్ను లమృతరసపూర్ణము లయినవి.

గీ. కలిగె ఖలనిగ్రహము రాజకులమునందుఁ;
బూజ్యులైరి శమాదిసద్గుణులెల్ల ?
జీవులెల్లను వశ్యులై సేవచేయ,
నెసఁగుచున్నారు సర్వలోకేశ్వరుండు.

శాంతి—(చేరఁబోయి)అమ్మా! నీవునిలుచుండి యేమియాలోచించుచున్నావు?

శ్రద్ధ—బిడ్డా! రాజకుల మారోగ్యమును బొందఁగా జూచి చిరకాలమునకిప్పుడుగదా నాకన్నులమృతరసపూర్ణము లయినవి.

సీ. కలిగె ఖలనిగ్రహము రాజకులమునందుఁ;
బూజ్యులైరి శమాదిగుణప్రముఖులెల్ల;
జీవులెల్లను వశ్యులై సేవచేయ,
నెసఁగుచున్నాఁడు సర్వలోకేశ్వరుండు.

(అని మరలఁ పఠించుచున్నది.)

శాంతి—ఇప్పుడు మనస్సువిషయమున స్వామియైన పురుషుని ప్రవర్తనమెట్లున్నది?

శ్రద్ధ—పథ్యునివిషయమునను నిగ్రాహ్యుని విషయమునను నెట్లుండవలయునో యట్లున్నది.

శాంతి—అట్లయిన, స్వామియే సామ్రాజ్యము నలంకరించునా యేమి?

శ్రద్ధ—దానికి సందేహమేమి? ఆత్మానుసంధానము చేసినయెడల, స్వామియే స్వారాట్టును సమ్రాట్టును నగును.

శాంతి—ఇఁక జీవేశ్వరునకు మాయయం దెట్టియనుగ్రహము గలదు?

శ్రద్ధ—నిగ్రహమని చెప్పవలెను. అనుగ్రహ మెట్లు శక్యమగును? పురుషుఁ డిప్పుడు సర్వానర్థబీజభూత యయిన యీమాయను సర్వథా నిగ్రాహ్యురాలని తలఁచుచున్నాఁడు.

శాంతి—అట్లయినపక్షమున, రాజకులముయొక్క స్థితి యిప్పుడెట్లున్నది?

శ్రద్ధ—వినుము. పురుషునకు—

శా. నిత్యానిత్యవిమర్శ యిష్టసతి; సన్మిత్రుండు వైరాగ్యుఁ; డా
త్మాస్యాంతాగ్రహితుల్ యమాదులు; సహాయాప్తుల్ శమాద్యుత్తముల్;
మైత్ర్యాదుల్ పరిచారికల్; సహచరీమాత్రల్లి మోక్షేచ్ఛ; దు
ష్కృత్యుల్ మోహమమత్వముఖ్యరిపు లుచ్ఛేద్యుల్ బలాత్కారతన్.

శాంతి—మఱి ధర్మునియెడల స్వామి కెట్టి ప్రీతి కలదు?

శ్రద్ధ—పుత్రీ! వైరాగ్యసన్నికర్ష మయినది మొదలుకొని స్వామి యిహపర ఫలభోగములయందు నితాంతమును విరక్తుఁడయియే యున్నాఁడు. అందుచేతనే యతఁడు

గీ. నరకహేతువౌ పాపంబునకును బోలె,
నశ్వరము నౌ పుణ్యఫలంబునకును వెఱచు;
శుద్ధనిష్కామతను జేయుసుకృతకర్మ
మునకు నెట్టులో తా నియ్యకొనుచు నుండు.

ఇట్లు స్వామి యాత్మైకనిష్ఠుఁడయి యుండుట కనిపెట్టి ధర్ముఁడు తాను గృతకృత్యుఁ డయినట్లెంచుకొని తనకుఁ దానే తనవ్యాపారమును వదలుకొన్నవాఁ డయ్యెను.

శాంతి—అప్పుడు యోగవిఘ్నులను వెంటఁగొని మహామోహుఁ డదృశ్యుఁ డయ్యెనే, వారివృత్తాంత మేమి ?

శ్రద్ధ—పుత్రీ ! అట్టిదురవస్థను బొందినవాఁడయ్యును మహామోహహతకుఁడు స్వామిని మోసపుచ్చుటకయి మధుమతి యనువిద్యతోఁ గూడ యోగవిఘ్నులను బంపెను. స్వామి వారియందుఁ దగులుకొన్నయెడల, వివేకుఁ డుపనిషచ్చింతనైనను జేయకుండునని వాని యభిప్రాయము.

శాంతి—ఔరా ! తరువాత ! తరువాత ?

శ్రద్ధ—తరువాత వారుపోయి స్వామికొక యైంద్రజాలికవిద్యను జూపిరి. పా రలోకయత్యాశ్చర్యకరరూపమును జూపి సంభ్రమముతో నిట్లనిరి. ఓస్వామీ !

చ. అచిరముగా నిటుండి విను మబ్రపటక్ శతయోజనధ్వనుల్ ;
ప్రచురము చేయుము న్వినని భారతి వివపురాణగాథలన్ ;
రచనయొనర్చు శుద్ధపదరమ్యత స్వేచ్ఛను గావ్యశాస్త్రముల్ ;
ఖచరగతిం జరింపుము జగంబుల ; మేరునగస్థలుల్గనున్.

అత్తఁడు మధుమతీవిద్యచేతఁ గల్పింపఁబడిన ప్రదేశమును జేరఁగా, స్థానాభిమానదేవత లాశపుట్టునట్లుగా నిట్లనిరి:—అయ్యో ! ఇందుఁ గూరుచుండుము ; ఇక్కడ జననమరణములు లేవు ? ఈప్రదేశము సహజసుందర మైనది? వివిధవిలాసవేషలావణ్యవతులును బుణ్యమయాలును మంగళాన్ఘ్రివ్యగ్రపాణులును బ్రణయకృత్యచతురలును నగవిద్యాధరకాంతలు వీరె నీయొద్దనున్నారు. కాఁబట్టి యిటురమ్ము.

గీ. కనకసికతాస్థలములు కలుగునదుల,
ఘనజఘనవలు వశోరులా కమలముఖులఁ,
మరకతదళప్రముఖసాలిఁ, బొరయుము మీవు
పుణ్యసముపార్జితాఖిలభోగములను.

శాంతి—అటుపిమ్మట ?

శ్రద్ధ—పుత్రీ ! ఆమాటలువిని మాయ యిది శ్లాఘ్యమయినదని చెప్పెను; మనస్సనుమోదించెను. సంకల్పుఁడును బ్రోత్సాహపఱిచెను. స్వామి యంగీకారమార్గమును బొందినవానివలె నుండెను.

శాంతి—(ఖేదముతో) అయ్యో ! స్వామి మరలసంసారవాగురలోఁ దగులుకొనుచున్నాఁడు.

శ్రద్ధ—లేదు. లేదు.

శాంతి—ఆవల నేమిజరిగినది ?

శ్రద్ధ—అప్పుడు పార్శ్వవర్తియైన తరుణుఁడు వారినందఱిని క్రోధావేశకషాయితలోచనుఁడయి చూచి, స్వామినిగూర్చి యిట్లనియె:—"ఓస్వామీ! విషయామిషగార్ధ్రసాభిలాషులును సభాప్రతారణపూర్వకులును నైన వీరిట్లు నిన్నుమరల దుస్సహా విషయాగ్నిజ్వాలలయందుఁ బడఁద్రోయుచుండఁగాఁ దెలిసికోలేకున్నావేమి?

క. భవసాగరమును దాఁటఁగ
నవలీలం బ్రాప్తమైనయాలయోగతరిన్
దవుల విడనాడి వెస నిపు
డవగాహన మేల చేసె దంగారనదిన్?

శాంతి—అటుతరువాత?

శ్రద్ధ—అప్పుడాతనిమాటవిని, 'విషయసుఖములకు నమస్కార'మనిపలికి, పురుషుఁడు సాధుమతిని దిరస్కారము చేసెను.

శాంతి—మేలు! మేలు! నీవిప్పుడెక్కడకు బయలుదేరినావు?

శ్రద్ధ—"నేను వివేకునిఁ జూడఁగోరుచున్నాను. కాఁబట్టి నీవాతనిని శీఘ్రముగాఁ గొనిరమ్ము." అని స్వామి నాకాజ్ఞయిచ్చెను. కాఁబట్టి నేనిప్పుడు మహారాజు సన్నిధికి బయలుదేరినాను.

శాంతి—నాకును మహారాజుగారుపనిషద్దేవిని దీసికొనిరమ్మని యాజ్ఞయిచ్చినారు. కాఁగాక! మనము స్వామినియోగమును నెఱవేర్తము.

(అని యిద్దఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రవేశకము.

---

[అప్పుడు పురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

పురు—(ఆలోచించి హర్షముతో) ఓహో! ఏమి యీవిష్ణుభక్తిదేవిమాహాత్మ్యము; ఆమె యనుగ్రహముచేత నేను—

మ. వడిఁగ్లేశోర్ములతిక్రమించి, మమతావర్తంబులన్ దాఁటితిన్;
గడచన్ మిత్రకళత్రబంధుమకరగ్రాహంబులం దోలితిన్?
జెడఁగా నార్చితిఁ గ్రోధబాడబశిఖిన్; తృష్ణాలతల్ ద్రెం
గడు సంసారసముద్రతీర మిపుడేఁ గంటిన్ సమీపింపఁగన్

[అంతట నుపనిషద్దేవియు శాంతియుఁ బ్రవేశించుచున్నా

ఉప—సఖీ! అట్లు నిర్దయుఁడయి యుండినభర్తయొక్క

చూడఁగలను ? అతనిచేత నేను చిరకాలము పరదారవలె విడిచిపెట్టఁబడి యేకాకిని నయి యుంటిని.

శాంతి—దేవీ ! అవిధముగా నాపదలపాలయినభర్తగారి నేలనిందించెదవు ?

ఉప—సఖీ ! ఇట్లుచెప్పెదు నీ వప్పటినాకష్టదశను జూడలేదు వినుము—

చ. అకట ! వివేకుఁ డట్లు విధియత్నమునన్ నను దవ్వొనర్చుటన్,
సకలఖలుల్ కుబుద్ధియయి నన్ దమదాసిగఁజేయ నీడ్వఁగా
శకలములై మణుల్పడల జంకిచెడెం గరకంకణావళుల్ ;
ప్రకట శిరోమణుల్గూలఁగ లాగుటచేఁ దెగెఁ గేశపాశముల్.

శాంతి—సఖీ ! ఇది యంతయు నామహామోహుని దుర్విలసితము. ఇందుభర్తగారి యపరాధ మేదియు లేదు. వానిచేతనే మనస్సు కామాదుల ద్వారమున మోహపెట్టఁబడుటచే వివేకుఁడు నిన్నుండి దూరము చేయఁబడినాఁడు. ఇట్లు విపన్నుఁడయిన నిజవల్లభునిసమయము ప్రతీక్షించి యుండుట కులస్త్రీలకు నైసర్గికశీలము కాఁబట్టి నీవువచ్చి దర్శనముచేతను బ్రియాలాపముచేతను భర్తను సంభావింపుము. ఇప్పుడు శత్రులు హతముచేయఁబడినారు. నీమనోరథములు సంపూర్ణములయినవి.

ఉప—సఖీ ! నేనిప్పుడిట వచ్చునప్పుడు నాకూఁతురైనగీతాదేవి రహస్యముగా "స్వామియైన పురుషుఁడును భర్తయు నిన్నడిగినప్రశ్నలకు నుత్తరములు చెప్పి నీవు వారిని సంభావింపవలయును ; తన్మూలమునఁ బ్రబోధోత్పత్తి కాఁగలదు." అనిచెప్పినది. నేనెట్లు గురుజనులముందు బ్రాగల్భ్యమును జూపఁగలను ?

శాంతి—దేవీ ! భగవతియైన గీతాదేవియొక్క యీవాక్యమునకు విచారింపఁబని లేదు. ఈయర్థము నేభగవతియైనవిష్ణుభక్తిదేవి వివేకస్వామితోడఁ జెప్పినది. కాఁబట్టి వచ్చిభర్తను, ఆదిపురుషుని, నీదర్శనముచేత సన్మానింపుము.

ఉప—ప్రియసఖి చెప్పినట్లు చేసెదను. (అని ముందుకు నడుచుచున్నది.)

[అప్పుడు వివేకమహారాజును శ్రద్ధయుఁ బ్రవేశించుచున్నారు.]

వివే—వత్సా ! శ్రద్ధా ! శాంతి నాప్రియురాలైనయుపనిషత్కాంతనుజూచునా ?

శ్రద్ధ—దేవా ! మీయాజ్ఞను దలఁదాల్చిపోయినశాంతి యామె నెట్లు చూడ
?

ఎక్కడఁజూచును ?

వా ! మందరపర్వతమునందు మధుసూధనాలయములో నామెతక్క

గాదేవిమఱుఁగు చొచ్చియున్నదనియీవఱకే విష్ణుభక్తిదేవి చెప్పినది

ల కేల భయపడవలెను ?

శ్రద్ధ—దేవా! ఈసంగతి మీకామెయే వివరముగాఁ జెప్పఁగలదు. కాఁబట్టి జేసరవాయ విచ్చేయుఁడు, ఇదె పురుషుఁడు మీయాగమనమునే తలఁచుకొనుచు నొంటిగా నున్నవాఁడు.

వివే—(చేరువకుఁబోయి) స్వామీ! అభివాదము చేయుచున్నాను.

పురు—వత్సా! ఈశిష్టాచారము క్రమవిరుద్ధమయినది. జ్ఞానవృద్ధుఁడవైననీవే నాకుపదేశదానముచేతఁ బితృభావమును బొందితివి ఎట్లన—

గీ. మున్ను ధర్మమార్గము తప్పి భూమిసురులు
తనయులను వేఁడుకొని రల్లదారి చూప;
శిష్యులఁగ వారిజ్ఞానంబుచే గ్రహించి,
సుతులు 'సుతులార! విను'డని పితల ననిరి.

కాఁబట్టి నీవును మాయెడలఁ బితృత్వముచేత వర్తింపవలయును. ఇదియేధర్మము.

శాంతి—దేవీ! ఇదె వివేకునితోఁడఁ బురుషుఁ డొంటిగా నున్నాఁడు. సన్నిధికిఁ బొమ్ము.

ఉప—(సమీపమునకుఁ బోవుచున్నది.)

శాంతి—స్వామీ! ఉపనిషద్దేవి యిదిగో మీపాదవందనము చేయవచ్చియున్నది.

పురు—అట్లుకాదు. అట్లుకాదు. తత్త్వావబోధోదయముచేత నీ మెయే నాకు మాత. కాఁబట్టి నేనే యామెకు నమస్కరింపవలెను. అంతేకాక,

క. జనకి దేవికిఁ గలదు
ననుగ్రహముఁ జూపుటందునంతరమెంతో;
జనని భవబంధములఁ గడుఁ
బెనఁచును; బంధములు దేవి విడిపించుఁగడున్.

ఉప—(వివేకునిఁ జూచి నమస్కరించి దూరముగాఁ గూరుచున్నది.)

పురు—అమ్మా! నీవింతవఱకును దినము లెట్లుగడపితివో చెప్పుము.

ఉప—స్వామీ!

ఉ. పుచ్చితిఁ బెక్కునాళ్ళు ఘనమూర్ఖులతోడను నేమతంబులన్,
రచ్చల, శూన్యదేవభవనంబుల, వ్యర్థవచఃప్రసంగతిన్.

పురు—మఱి వారు నీచేతఁ దత్త్వము నేమైనఁ దెలిసికొన్నారా?

ఉప—లేదు. లేదు. వారు—

మచ్చిక ద్రావిడాంగనలమాటలకట్లు గ్రహింపకర్థమున్,
జెచ్చెర నస్మదుక్తులకు స్వేచ్ఛ నొనర్చి రపార్థకల్పనల్.

వారికి వాక్యార్థవిచారములని ప్రయోజన మంతయుం గేవలపరధనగ్రహణార్థమే.

పురు—తరువాత? తరువాత?

ఉప—తరువాత నేనొకచోట

మ. పరిపూర్ణాజ్యమహాన్నగాజనసమిద్వహ్నిస్రువోపేతలై,
వరసోమేష్టిపశుప్రభృత్యురుమఖవ్రాతోల్లసత్సాధ్వలై,
నిరతప్రాకృతకర్మకాండబహుధానిర్దిష్టమార్గాళిలై,
సరసం గ్రుమ్మరుయజ్ఞవిద్యఁ బొడగాంచం గంటి మార్గంబునన్.

పురు—అటుతరువాత?

ఉప—తరువాతఁ బుస్తకభారవాహిని యైనయామెకు నాతత్త్వమేమయినఁ దెలిసి యుండునని యెంచి నేనామెసన్నిధిని గొన్నిదినములు గడపవలెనని తలఁచితిని.

పురు—తదనంతరము?

ఉప—తదనంతరము నేనామె సమీపమునకుఁబోఁగా, "ఓసుమంగళీ! నీకోరిక యేమి?" అనియామె నన్నడిగెను. "అమ్మా! నేనిప్పుడనాథనయి యున్నదానను. కాఁబట్టి నీయొద్దనుండఁగోరుచున్నాను." అని నేను జెప్పితిని.

పురు—అటుపిమ్మట?

ఉప—అటుపిమ్మట "ఓసుమంగళీ! నీవుచేయుపనియేమి?" అనియామె నన్నడిగెను.

పురు—అటువెనుక?

ఉప—అప్పుడు నేనిట్లంటిని—

చ. ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు, నీజగం
బెవ్వనికాంతిచే వెలుఁగు, నెవ్వనితేజము సత్సుఖోజ్జ్వలం,
బెవ్వనిఁ గెల్చి ద్వైతము మేగఁ బునర్భవ మొందరెప్పుడున్
నెవ్వఁడు పుణ్యుఁ, డాపురుషు నిత్యుని శాంతు స్తుతింతు నక్రియున్

అంతట యజ్ఞవిద్య యాలోచించి యిట్లనియెను—

గీ. అక్రియుఁడగు వాఁ డీశ్వరుండగుట యెట్లు?
సత్క్రియలుగాని వస్తువిచారబుద్ధి
యరయ భవబంధనాశనకరము గాదు;
జనుఁడు భవనాశకరకర్మ లొనరఁ జేసి
వత్సరశతంబు శాంతుఁడై బ్రతుకఁగోరు.

పురు—అనంతరము,

ఉప—అనంతరము నేనామెను సహితము పూర్వమువలెనే యాశ్రయమును వేఁడితిని. అప్పుడామెయు "ఓసుమంగళీ! నీవుచేయుపనియేమి?" అని నన్నడిగెను. అంతట నేను దొంటివలెనే "ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు" మొదలు గాఁగల వాక్యమును జెప్పితిని,

పురు—అవల?

ఉప—అవల మీమాంస పార్శ్వవర్తులముఖమును జూచి "లోకాంతరఫలోపభోగయోగ్యుఁడైన పురుషునిఁ బ్రతిపాదించుటచేత మనకీమెవలనఁ బ్రయోజనము గలదు. కాఁబట్టి కర్మోపయుక్తయైన యీమెను స్వీకరింపుఁడు." అనిపలికెను. అక్కడ వారిలో నొకశిష్యుఁడు దాని కనుమోదించెను. ప్రసిద్ధప్రతిష్ఠుఁడైన కుమారిల స్వామియను మతి యొకఁడు మీమాంసాహృదయాధిదేవతయో యనునట్లుగా "దేవీ! ఈమె కర్మోపయుక్తుఁడయిన పురుషునిఁ బ్రసాదింపదు; కర్తయును భోక్తయుఁ గానియీశ్వరునిఁ బ్రతిపాదించును. ఈమె కర్మలకించుకయు నుపయోగపడునది కాదు." అనెను. అప్పుడింకొకఁడు "లౌకికపురుషు నికంటెనన్యుఁడయి యీశ్వరుఁడని యొకఁడున్నాఁడా?" అనియడిగెను. అంతనతఁడునవ్వి "ఉన్నాఁడు" అని మరల నిట్లనియెను:—

చ. ఒకఁడు మనుజగత్త్రితయుల, నొక్కఁడు మోహమయాంధబుద్ధియౌ;
నొకఁడిడుఁ గర్మజాలఫల, మొక్కఁడు తత్ఫలవాంఛఁ జేయుఁ; దా
నొకఁడు శరీరుల న్నడుపు, నొక్కఁడు కర్మముల న్నియుక్తుఁడో;
నిఁక నువిసంగుఁడో పరము నిల్లుగుఁ జెప్పఁగఁ గర్మభోక్తఁగన్?

వివే—(హర్షముతో) మేలు! కుమారిలస్వామీ! మేలు! నీవు మంచిప్రజ్ఞఁ గలవాఁడవు. నీవు దీర్ఘాయుష్మంతుఁడవుకమ్ము.

క. సహవాసులుఁ జెలులునగు నా
విహగంబులు రెండు నేకవృక్షము చేరున్;
విహగ మొకటి తిను ఫలముల;
నహహా! రెండవది తినక యాలోకించున్.

పురు—తరువాత?

ఉప—తరువాత నేను మీమాంసవద్ద సెలవుగైకొని వెడలితిని.

పురు—అటుతరువాత?

ఉప—అటుతరువాత నేను శిష్యులు పలువుండఁగచేత నుపాస్యమానలైన తర్కముఁ గాంచితిని. అందు.

మ. తెలుపు న్విశ్వవిశేష మో; క్కొకతె వాదించున్ వితండావృతిన్
లలి జాతిచ్ఛలనిగ్రహాదికమహాన్యాయాళితో జల్పముల్ ;
పెలుచన్ వాక్షాణుఁ బూనుప్రకృతిసంభేదంబు లొక్కర్తు. సం
ఖ్యలచే నెన్నుదుఁ దత్త్వముల్ మహదహంకారాదిసర్గంబులన్.

పురు—తరువాత ? తరువాత ?

ఉప—పూర్వరీతినే నేనును వారి సమీపమునకుఁ బోయి, వారడిగినమీఁదట "ఎవ్వనిలో జగంబు జనియించి రమించి లయించు" ఇత్యాదివాక్యములచేత మునుపటి యట్లే నాకార్యమును జెప్పితిని. అప్పుడు వారు నన్నుఁ బ్రత్యక్షముగాఁ బరిహసించి "ఓవాచాలులారా! విశ్వము పరమాణువులవలనఁ గలుగుచున్నది ఈశ్వరుఁడు నిమిత్త కారణము" అనిపలికిరి. అందొకొక్కతె కోపముతో "ఓసిపాపాత్మురాలా! ఈశ్వరునే సవికారునిఁజేసి వినాశధర్మము నాపాదించుచున్నావేమి?" అనెను మఱియొకతె "ఓసీ ! విశ్వోత్పత్తి ప్రకృతివలనఁ"గలిగెనని పలికెను.

వివే—ఓహో ! తర్కవిద్య లెంతదుర్మతులు ! ఘటాదికమువలెనే ప్రమేయ జాతము సర్వమును గార్యమనిసహిత మింతమాత్రము తెలిసికొనఁజాలకున్నారు. పరమాణువులును బ్రకృతియు నుపాదానకారణము లనుటయు నుపేక్షణీయమే.

మ. జలచంద్రుంబలె నంతరిక్షనగరస్వప్నేంద్రజాలంబు ల
ట్లలవిశ్వంబును మిథ్య, మేయమును గార్యంబౌట సాద్యంతతన్ ;
కలుగున్ శుక్తిని వెండియట్లు శివుగాఁగం దెల్పెఁదన్నామమిన్ ;
పొలియున్ స్రక్కునఁ బన్నగభ్రమువలెన్ బోధోదయప్రాప్తిచేన్.

ఇఁక వికారశంకయు ముగ్ధధూమానస విలసితమే. ఎట్లన—

ఉ. శాంతము నిర్మలంబును నజంబు ననంతము నిష్కలంబు నౌ
సంతతతేజ మీభువనసంభవమందు వికార మొందునే ?
కాంతిని నల్లగల్వల నగంగలమబ్బులచాలు పుట్టుచో,
నింతయు నాకసంబు వహియించునె తాను వికారలేశమున్ ?

పురు—సాధు! సాధు ! పరిజ్ఞానవంతుఁడవయినయీనీవిమర్శనము నాడెంద మానంద పెట్టుచున్నది. (ఉపనిషద్దేవినిగూర్చి) తదనంతరము ?

ఉప——తదనంతరము వారందఱును మండిపడి, "ఓహో ! విశ్వవిలయ ముక్తి కలుగునని ప్రేలుదు, నాస్తికమార్గము నవలంబించుచున్న దీనినిబట్ట వలెను" అని యందఱును ససంరంభముగా నన్ను నిగ్రహించుట కుద్యుక్త

పురు—(భయముతో) ఆపయిని ?

పురు—(ధ్యానము నటించుచున్నాఁడు.)

(నేపథ్యమునందు) ఆశ్చర్యము ! ఆశ్చర్యము !

మ. ఉరుకాంతిచ్ఛటలన్ దిశావళుల విద్యుల్లీల వెల్గింపుచున్,
ఖరదీప్త్యాప్తివిశాలమౌ మనసువక్షంబుఁ జీల్చి పోఁ బుట్టి, త
త్పరివారంబును మోహుని న్నెఱవి, విద్యాకన్య తోడ్తోడఁగో
చరయై పోయెఁ; బ్రబోధచంద్రుఁడును దా జన్మించె జీవున్గనన్.

[అప్పుడు ప్రబోధచంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ప్రబో—శా. స్యూతమొ, వ్యాప్తమొ, మఱి యుపోహితమొ, యపసారితంబొ, సం
భూతవిలాపితంబొ, హృతమొ, యనుతర్కము లేక, యేని సం
జాతముచేఁ బ్రపంచము వెసం జెడునో సహజప్రకాశలీ
నాతతరూపమై, యలమహాత్ముఁడ నేను బ్రబోధచంద్రుఁడన్.

(ముందుకు నడిచి) ఇతఁడే పురుషుఁడు. ఈతని దాపునకుఁ బోయెదను. (సమీపించి) దేవా ! ప్రబోధచంద్రుఁడను నేను నమస్కారము చేయుచున్నాను.

పురు—(ఆహ్లాదముతో) వత్సా ! రమ్ము. నన్నుఁ గౌఁగిలించుకొమ్ము.

ప్రబో—(ఆలింగనము చేయుచున్నాఁడు.)

పురు—(ఆనందముతో) ఓహో! ఇప్పుడు విధూతతిమిరజాతమయి ప్రభాతము సంజాతమయినది !

చ. ఒకటఁ బ్రబోధచంద్రమహితోదయ మాటను జేసి యియ్యెడన్
బ్రకటవికల్పనిద్రయును బ్రస్ఫుటమోహతమంబుఁ బాయఁగాఁ,
జకచక నేనె శ్రద్ధ మతి శాంతి వివేక శమంబు లాదిగా
సకలజగన్మయుండనయి యొసంగనువిష్ణువుగా స్ఫురించెదున్.

ములచేతను నేను విష్ణుభక్తి దేవిప్రసాదమువలనఁ గృతకృత్యుఁడ నయినాఁడను.

ఁడు—

చి సమస్తసంగములు, నేఁడక విశ్వములోని దేదియున్,
మూలలందొ ఫలకాంక్షయొనర్పక సంచరించుచున్,
పమున్ భయము శోకము మోహము నుజ్జగించి, యి
తి శాంతి భృశముం గని, గాత్రియె నిల్చుతావుగన్.

విష్ణుభక్తిదేవి ప్రవేశించుచున్నది.]

సమీపించి) శమితారాతివైయున్న నిన్నిప్పుడు చూచు
నా మనోరథములన్నియు సంపూర్ణములయినవి!

పురు — దేవిగారి ప్రసాద మున్నప్పుడు దుష్కరమేది యుండును ? (అని పాదములమీఁదఁ బడుచున్నాఁడు.)

విష్ణు — (పురుషుని లేవనెత్తుచు) వత్సా! లెమ్ము. ఇంకను నేను నీకేమి ప్రియము చేయుదును ?

పురు — ఇంతకంటె నాకుఁ బ్రియమేమున్నది ?

క. కృతకృత్యుం డయ్యెను దా
హతవిమతస్తోముఁ డగుచు నల్లవివేకుం;
డతివళితరజస్కుఁడనై
యతులసదానందపదవి నందితి నేనున్.

అయినను దా నీభరతవాక్యము సిద్ధించునుగాక !

చ. ఇలపయి నిష్టవృష్టిఁ గురియించునుగాత మేఘుఁడెంతయున్ !
గలుముల రాజు లేలుదురుగాక మహీన్నిరుపద్రవంబుగన్ !
వెలితెలివిందమంబడఁచి ధీ మహితా విషయోగ్రసంకమై
కలఁచుభవాబ్ధి దాఁటుదురుగాక మహాత్ములు నీదు సత్కృపన్ !

సంపూర్ణము.

